కష్టాలనేవి అందరికీ మామూలే అయినా, తామేదో ప్రత్యేకమనీ, ఒబజ్జీ తమలాంటి వాళ్ళకి అవి రాకూడదని గొంతెమ్మ కోరికలు కోరుతూ వుంటారు. భ్రమలు లేకుండా బ్రతకడం వీరికి చాలా కష్టంగా తోస్తుంది.

ఇతర జీవాలతో పోల్చి చూస్తే, పసితనపు ఛాయలూ, ఆధారపడే మనస్తత్వం పక్షులూ, జంతువులకన్నా 'మనుషుల్లోనే' దీర్ఘకాలం కన్పిస్తుంది.

వయస్సు పెరుగుతున్నకొద్దీ, చుట్టూ వున్న రిస్క్ అర్థమవడం వల్ల తమను కృంగదీసే పరిస్థితులమీద అనాసక్తత కలిగి, 'అజ్ఞానమూ, ఏమీ తెలియనితనమే' సేఫ్ అనుకునే స్థితికొస్తారు. ఇది సేఫ్టీ అనుకోవడం ఎంత అబద్ధపు భావాన్నైనా, వారికది బాగా తోడ్పడుతుంది. పిల్లల్లో అలాంటి అమాయకత్వం గొప్ప కంఫర్టు ఇస్తుంది. 'సూర్యుడెందుకు ఉదయిస్తాడు?' అనే ప్రశ్నకి 'ఉదయించాలి కాబట్టి' లేదా, 'నేను ప్రొద్దున్నే లేవాల్సిన సమయం తెలియడానికి' అన్న సమాధానాలు బోల్డంత సంతృప్తి కల్గిస్తాయి. 'సూర్యుడు ఎందుకు అస్తమిస్తాడు?' అన్న ప్రశ్నకి, 'అల్సిపోతాడు కాబట్టి' అనో 'నేను నిద్రపోవాలి కదా మరి' అనే సమాధానాలు మనం ఎదురు చూడవచ్చు. సింప్లిసిటీయో లేదా, ప్రపంచంలో ఏదైనా 'తమ అనుకూలం కోసమే' అనే భావన వారికి బాగా నచ్చుతుంది. 'వానా వానా రావమ్మా, నన్ను తడిపి పోవమ్మా' అని ప్రకృతిని కమాండ్ చేయడంలో వున్న ఆనందం ఇంత పెద్ద ప్రపంచంలో ఓ చిన్న పిపీలికం మనిషి అన్న వచ్చి నిజం రియలైజ్ చేయడంలో రాదు. కానీ ఈ సూడో - అమాయకత్వంలో వుండడంవల్ల మన పవర్ మనకు తెలిసే అవకాశం లేదు.

నిజాలు అర్థమయ్యేకొద్దీ, ఒక రకమైన అయిష్టత పెరుగుతూ వుంటుంది. మనం పట్టించుకోకుండా అమాయకంగా వుండాలనుకునేకొద్దీ ఆ అయిష్టత పెరుగుతూ వుంటుంది. అందుకే మన వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవాలి. స్వేచ్ఛగా, స్వతంత్రంగా బ్రతకడంలో వున్న ఆనందాన్ని డిస్కవర్ చేయాలి. అలా చేయగలగాలంటే, మనం మన

అమాయకత్వం ముసుగు నుంచి బయటపడాలి. ఇది మనకు చాలా సంక్లిష్ట మైన వ్యవహారంలా కన్పించవచ్చు.

పరిస్థితుల్ని మరింత విషమం కాకుండా కాపాడుకోగలగడంలో మన లౌక్యం, మన తెలివితేటలు బయటపడతాయి. ఇదంతా కష్టమే అయినా, చెత్త సిద్ధాంతాల్ని నమ్మటంవల్ల కలిగే నిస్పృహ, క్షోభ అంత బాధాకరం మాత్రం కాదు.

కొంత సూడో - ఇన్నోసెన్స్‌తో కొంతమంది పెద్ద వేదాంతుల్లా, అన్నీ త్యజించిన మహర్షుల్లా ఫోజిచ్చేస్తూ వుంటారు. ఇలా కన్పించడానికి వాళ్ళ జీవితంలో అతి చిన్న చిన్న ఆనందాలకు కూడా దూర మవ్వాల్సొస్తుంది. దానికి సిద్ధంగా లేని పక్షంలో మరింత అభాసుపాలయే ప్రమాదం వుంది.

మనం చేసే ప్రతి పని వెనుక కారణాలు వెదుక్కోవడం చాలా అవసరం.

మనం చేసే పనులన్నిటికీ మూడు స్టేజీలు వుంటాయి.

మొదటి స్టేజీలో—మనకేదో కావాలనో, ఏదో లేదనో అనిపిస్తూ వుంటుంది. ఆ అసంతృప్తి అస్పష్టంగా తెలుస్తూ వుంటుంది. ఒక పని చెయ్యాలనిపిస్తుంది. అది చెయ్యకపోతే ఇబ్బందిగా ఉంటుంది.

ఇక రెండో స్టేజిలో—ఏదో విధంగా మన అవసరాన్ని తృప్తి పరుచుకోవాలనిపిస్తుంది. ప్రయత్నం చేయటం మొదలవుతుంది.

మూడోది—తృప్తి స్టేజి. పనిచేయటంవల్ల కలిగే సంతృప్తి ఇది.

ఈ ప్రపంచంలో చాలామంది మొదటి స్టేజిలో ఆగిపోతారు. ఇంకా చాలామంది రెండో స్టేజీలో ఆగిపోయి బాధపడతారు. కొద్దిమందే మూడో స్టేజి పూర్తి చేస్తారు.

అందుకే 'ఆరంభింపరు నీచ మానవులు' అన్నాడు భర్తృహరి.

—*—



యండమూరి వీరేంద్రనాథ్